# తరగతిగది తత్వశాస్త్రం

## (The Philosophy of the Class Room)










HOMESCHOOL TIP

Learning does not have to come from a textbook or take place during a certain time frame. -Jen Grice




"Educating the mind without educating the heart is no education at all."

Aristotle







Education itself is a putting off, a postponement; we are told to work hard to get good results. Why? So we can get a good job. What is a good job? One that pays well. Oh. And that's it? All this suffering, merely so that we can earn a lot of money, which, even if we manage it, will not solve our problems anyway? It's a tragically limited idea of what life is all about.

~ Tom Hodgkinson







Whoever wants to understand much must play much.

Gottfried Benn



Sitting in class wondering how the hell the teacher got the job.










**విద్య అధ్యయన వేదిక**

**ఆంధ్రప్రదేశ్ – తెలంగాణ**

# తరగతిగది తత్వశాస్త్రం

(The Philosophy of the Classroom)

గౌరవ్

ప్రత్యామ్నాయ ప్రస్థాన కేంద్రం సారధ్యంలో

ముద్రణాకాలం : ఫిబ్రవరి, 2017



ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

ప్రతిపాదిత చందా : రూ. 10/-

---

**ఇందులో.....**



# ముందుమాట

ప్రతీ స్కూలుకూ ఒక సిద్ధాంతమున్నట్లే ప్రతీ తరగతికీ ఒక తత్వముంటుంది. చదువునొక బ్రహ్మపదార్ధంగా, బడినొహ మోక్షమార్గంగా ప్రచారం చేస్తూ, నాలుగ్గోడల మధ్యా నిర్దేశించబడిన పదజాలంతో నిర్ణీత సమయాన్ని కేటాయించుకొని కొందరు పెద్దలు ఎంపిక చేసిన అంశాల్ని క్రమబద్ధంగా పిల్లల బుర్రల్లోకి జొప్పించడాన్నే 'విద్య' అనుకొంటున్నాం మనం. ఈ రోజున్న స్థితే కనుక కొనసాగితే భవిష్యత్తెంత దిగజారిపోతుందోననే ఆందోళనే ఈ అక్షరాలకి ప్రధానమైన ప్రేరణ. సాంఘిక హితానికేమాత్రం ఉపయోగపడని ఒక అవ్యవస్థ అరాచకత్వాన్ని పెంపొందిస్తూ మానవాళి ఆత్మికస్థాయిని సరిచేసుకోలేనంతగా విధ్వంసం చేస్తుంటే, చూస్తూ ఊరుకోవడం ఆత్మహత్యాసదృశం.

విద్యకి విలువలే ప్రమాణం కావాలి కానీ విశ్వాసాలు కాదు. అవిద్యంటే అర్థం అక్షరజ్ఞానం లేకపోవడం కాదు. అహంభావాన్ని వీడి అందరితో కలవలేకపోవడం. ఈ దేశంలో నిజమైన నిరక్షరాస్యులు విద్యాధికులే. బాల్యం నుంచీ చదువనేదొక గుదిబండగా ఉండే వాతావరణంలో పిల్లలందర్నీ మర్యాదస్తులయిన పౌరులుగా, మతాలకి విధేయులుగా, సృజనాత్మకత లేని సంపాదనాపరులుగా మాత్రమే తయారుచేస్తూ వారిలోని సహజసిద్ధమయిన అనుభూతుల్నీ, భావోద్వేగాల్నీ దశలవారీ తరగతులుగా విభజించి నిర్దాక్షిణ్యంగా హత్య చేయడాన్నే విద్యనుకోవడం దారుణం.

విద్యని జీవితాన్ని నిర్దేశించే సహేతుకమైన భూమికగా కాక, ఖరీదు ద్వారా, పరిమాణం ద్వారా, మార్కులు ర్యాంకుల ద్వారా హోదానీ, పలుకుబడినీ పెంచి పోషించే అహేతుకమైన ఆధిపత్య రూపంగా చిత్రించడం మూలాన సజీవమయిన ఆలోచనల్నీ, అనుభవాల్నీ బలవంతంగా అణిచివేసుకుని కృత్రిమత్వంతో కూడిన నిర్జీవత్వాన్నే నిఖార్సైన ఆనందంగా భ్రమించడం సమాజానికి అలవాటైపోయింది. ఈ క్రమంలో మనుషులుగా కనిపించే బానిసజాతి ఉత్పత్తై మానవీయత వెనకబడింది.. ప్రశ్నించడమనేది నేరమై నోరు మూసుకు వినడం గౌరవనీయతను సంతరించుకుంది.

పనికట్టుకుని ఇంకేపనీ చేయకుండా పుస్తకాలు మాత్రమే చదివేవాళ్ళకు పనిపాటల శ్రమ సంస్కృతి చులకనగా కనిపించడం మొదలైంది. నాలుగ్గోడల బంధీఖానాలో బట్టీపడుతూ అరుపులతో బెదిరించే టీచర్ల నడుమ, మోసే బరువులతో,

వాచే దవడలతో చిన్నతనంలోనే మోయలేనంత విద్వేషాన్నీ, జీవితానికంతటికీ సరిపోయే అసహనాన్నీ మూటకట్టుకుంటున్న చిన్నారుల భవితవ్యం ఏమౌతుందోననే బాధ కూడా లేకుండా పోటీల పరుగులో, కోచింగ్‌ల వెలుగులోపడి లైటు పురుగుల్లా మాడిపోతున్న పిల్లల దైన్యస్థితికి కారణాలేంటి?

చదువు నాకేనాడూ నచ్చలేదు. అలా నచ్చకుండా ఏదోటి చదవడం విద్య కాదు. విద్యనేది ఎప్పుడూ వ్యక్తిగతం కాదు. అనంతమయిన విశ్వపు అగాధాల్నీ, నక్షత్రాల విచిత్ర కదలికల్నీ, నిత్యం గమిస్తూ కూడా స్థిరంగా అనిపించే భూగోళాన్ని గురించి ఐచ్ఛికంగా తెల్సుకునే విద్య శాస్త్రీయం. అద్వితీయమైన ప్రకృతి మార్పుల గురించీ, అడవులూ, జీవులూ, అందమయిన జలపాతాల గురించీ అనుభవంతో తెల్సుకునే విద్య ప్రాకృతం. ఆకలి గురించి, అన్నం గురించి, అదావిర్భవించడానికి కారణమైన శ్రమ గురించీ అసమానతల గురించి ఆలోచించి తెల్సుకునే విద్య మానవీయం.

ఇంతటి మహోన్నతమయిన ప్రజ్ఞాపూర్వక జిజ్ఞాసను నిస్తేజభరిత స్వార్థాలకూ – స్వప్రయోజనాలకూ కౄరంగా బలిస్తూ, చదువంటే తలొంచుకుని పోవడమేనన్న భావాన్నీ, అక్షరాస్యులంటే అస్తిత్వంలోనున్న అసమానతల్ని అంగీకరించి, వాట్ని కాపాడుతూండేవారనే దృక్పథాన్నీ చలామణీ చేయడం జరుగుతోంది. ప్రపంచంలోని బహుజన సమూహాల్నించీ వీలైనంత వేరయ్యీ, లేని ప్రత్యేకతను ప్రదర్శించుకోవడమే విద్య యొక్క ఉన్నతికి చిహ్నామైపోయింది. ఈ క్రమంలో ఇంజనీర్లుగా, డాక్టర్లుగా మలచబడటం కోసం వర్తమాన వ్యవస్థలో తల్లితండ్రులు, ఉపాధ్యాయులు, విద్యావేత్తలు, మేధావులు, ప్రభుత్వాల చేతుల్లో నిత్యం హత్య కావించబడుతున్న లక్షలాది మంది పిల్లల అంతరాత్మ సాక్షిగా,

ఈ కలం నిశ్శబ్ద మౌనఘోషకి బలమైన మరో చిహ్నం. అంతరించిపోతున్న విద్యాకుసుమాలకి మద్దతునిచ్చే ఆవేదనాభరిత సంకల్పం. అంతర్దృష్టిలేని విద్య హీనమని చీత్కరించే ఆవేశపూరిత స్వరసంగ్రామం.

ఆలోచించి గౌరవంగా ఆచరించడానికి పూనుకుంటారో, అనాలోచితంగా వ్యవహరించి ఊరుకుంటారో మీ ఇష్టం.

..........



# 2. స్కూల్

## స్కూలంటే ఏంటి?

వ్యక్తిని పసితనం నుంచే బానిసగా మార్చడం కొరకు ప్రపంచవ్యాప్తంగా నడుస్తున్న అతిపెద్ద యంత్రాంగం స్కూల్. అక్రమ అవయవాల వ్యాపారం, ఆయుధ వ్యాపారం కంటే ప్రమాదకరమయిన దళారీల్ని, దద్దమ్మలను ఒక క్రమపద్ధతిలో చట్టబద్ధంగా రూపొందించడం కోసం నిర్మితమయిన వినాశనాత్మక వ్యవస్థ స్కూల్. సహజమైన వాతావరణంలో స్వతస్సిద్ధంగా ఎదగాల్సిన పిల్లల్ని బందబారిన కృత్రిమ పద్ధతులతో దండగమారి మూకలుగా తయారుచేసి జీవితం నుంచి వీలైనంత దూరం పారిపోయి బతుకీడ్చే మర్యాదస్తులైన మందలుగా మలిచే అమానుష ప్రదేశం స్కూల్.

జ్ఞానార్జనని వ్యాపారం స్థాయికి దిగజార్చి, పిల్లల్ని అంకెలుగా చేసి ఆత్మీయసంబంధాల నడుమ వికసించాల్సిన స్పందనల్ని చంపేస్తూ, అందుకోసం సమాజం నుంచే సొమ్ము వసూలు చేస్తున్న గజదొంగల అడ్డా స్కూల్. చిన్నప్పట్నుంచే పిల్లల్లో విద్వేషాల్నీ, విషాల్నీ, ఆధిపత్యాన్నీ, అహంకారాన్నీ నింపి అసమానతలతో నిండిన సామాజిక వ్యవస్థలో కొద్దిమంది ప్రయోజనాల్ని కాపాడటం కోసం వారికి తెలీకుండానే ఒక వర్గానికి కాపలాకాసే బానిసజాతిని తరతరాలుగా ఉత్పత్తి చేస్తున్న అక్రమ వ్యవస్థ స్కూల్.

## స్కూల్ ఎందుకు?

ప్రపంచం అంతా ఒకటిగా లేదు. సమాజంలో అంతా సమానంగా లేరు. అలా ఎందుకు లేరనే ప్రశ్నను లేనివాళ్ళు వేసుకోకుండా చేసేందుకు ఉన్నవాళ్ళు పకడ్బందీగా రూపొందించిన వ్యవస్థలో ముఖ్యమైనవి రెండున్నాయి. మొదటిది మతమైతే, రెండోది చదువు (స్కూల్). నిజానికి స్కూలంటే మరో రూపంలో జనాల్ని మోసం చేయడానికి నిర్మించబడిన మతమే. మనుషులు దైనందిన జీవితంలో అనుభవించే బాధలకీ, దుఃఖానికీ విముక్తిని అన్వేషిస్తారనే భయంతో వారికి లేని మానసిక దుర్బలత్వాన్ని కలిగించి, అందుకోసం పరలోకాన్ని, మోక్షాన్ని సృష్టించి ఆ భావజాలంలో నిత్యం వార్ని పట్టి ఉంచే ఒక జలగ మతమైతే, కొద్దోగొప్పో మానసికంగా ఎదగాలనుకునే తెలివైనవార్ని అతి తెలివిగా మోసం చేస్తూ విద్యావంతులనే భ్రమను వారికి జీవితాంతం కల్పిస్తూ, బుద్ధిజీవులుగా, ఉద్యోగులుగా,

వ్యాపారస్తులుగా, వ్యవహారకర్తలుగా అనేక రూపాల్లో సారంలేని తరాల్ని తయారుచేయడమే లక్ష్యంగా పెట్టుకున్న పేరులేని ప్రమాదకర మతాలే స్కూళ్ళు.

మతాలకి బలయ్యేవారికి జీవితంలో ఏమీ తెలీనట్టే ఈ స్కూళ్ళకి బలై ఈరోజు ఉపాధ్యాయులుగా, ఉద్యోగులుగా, మేధావులుగా, సంఘజీవులుగా మిగిలేవారికి సైతం తెలియాల్సింది తెలీదు. అలా తెలీకుండా చేసేందుకు ఏర్పడ్డ బహుముఖ మార్మిక వ్యవస్థే స్కూలు.

**స్కూల్ ఏం చేస్తుంది?**

స్వయంగా కోళ్ళే కసాయి కొట్టువైపు తరలి వెళ్ళినట్లు పిల్లలంతా స్కూలుకెళ్ళే పౌరులుగా మారాలనే ఒక బుర్రతక్కువ నిర్ణయాన్ని అదేపనిగా అమలుచేయడంలో వ్యవస్థలన్నీ విజయవంతం అవ్వబట్టే వ్యవస్థ ఇంత అస్థవ్యస్తంగా నడుస్తోంది.

దైనందిన జీవితంతో సంబంధంలేని వేర్పాటువాద రీతిలో చిత్రవిచిత్రమయిన బట్టలు వేసుకోవడం నేర్పే స్కూల్, ఈ దేశానికేమాత్రం పరిచితం కాని ఆహారాన్ని, ఆహార్యాన్ని పిల్లల నెత్తినేసి రుద్దడం ఆధునికతగా ప్రచారం చేసుకుంటూ మురిసిముద్దైపోతుంది. దేశంలో 80% కి పైగా ఆధారపడే గ్రామీణ వ్యవస్థ గురించీ, వ్యవసాయరంగం గురించీ, చేతివృత్తుల గురించీ, కళాసాహిత్య సాంస్కృతిక రంగాల గురించీ ఈషణ్మాత్రం గౌరవం కూడా లేని జనం నాగరికత పేరుతో శ్రమని ఈసడించుకోవడమెలాగో స్కూళ్ళు నేర్పిస్తున్నాయి. మనుషుల్ని చులకనగా చూడటం, వస్తువుల కోసం పాకులాడ్డం, సమాజానికి దూరం జరగడం, సరుకులకై ఎగబడ్డం, సంతోషాన్ని భక్తిలో వెతుకులాడ్డం, విభిన్నత కోసం విలాసాల్ని ఆశ్రయించడం ఈ లక్షణాలన్నీ స్కూళ్ళే బోధిస్తున్నాయి.

**ఇదంతా ఎలా జరుగుతుంది?**

స్కూల్ తప్ప పిల్లలకి వేరే అతీగతీ లేదనే అబద్ధాన్ని అందరి మెదళ్ళలో నాటుకునేలా ప్రచారం చేస్తుంది. స్కూల్ నించి మినహాయించి వేరే తెలుసుకోవడమంటూ ఉండదనే అవాస్తవాన్ని జనాల్లోకి చొప్పించింది. స్కూల్‌ని కాదన్న వాదనను వెనక్కి నెట్టడం కోసం, స్కూల్‌కెళ్ళకపోవడాన్ని 'వెనకబాటుతనం'గా, 'అనాగరికతగా', 'అవిద్య'గా ప్రచారం చేసింది. అక్షరాస్యతకీ, స్కూల్‌కీ అవినాభావ సంబంధమేదో ఉందన్న భ్రమలో సమాజాన్ని ఉంచింది. ఆ క్రమంలో స్కూల్లో



పిల్లల్ని చేర్చకపోవడం ప్రభుత్వాల చేత 'నేరంగా' గుర్తింపజేసే స్థితికి చేర్చింది. ఇందుకోసం చట్టాల్ని రూపొందించి, స్కూలుకి వెళ్ళని పిల్లల్ని బలవంతంగా బడికి పంపడానికి 'నిర్బంధ విద్య'నే నిరంకుశ పద్ధతిని ప్రవేశపెట్టింది.

'నేర్చుకోడానికి' పుస్తకాలపైనా, అక్షరాలపైనా, ఉపాధ్యాయులపైనా, నోట్స్‌పైనా ఆధారపడే మనస్తత్వాన్ని జాగ్రత్తగా తీర్చిదిద్ది మొత్తంగా జీవితాంతం సొంతంగా ఏదీ ఆలోచించలేని మానసిక దుర్భలత్వాన్ని పిల్లల్లో ప్రవేశపెట్టడం స్కూల్ చేసే ప్రధమ కార్యక్రమం. ప్రకృతితో మమేకం కాకుండా, తప్పొప్పులతో కూడిన అనుభవాలేమీ లేకుండా 'నేర్చుకోవడం' అనేది పుస్తకాల్లోని పాఠాల్ని, అక్షరాల్ని బట్టీ పట్టడం ద్వారానో, బెత్తం దెబ్బలు తినడం వలనో వస్తుందనుకునే మూర్ఖపు టీచర్ల వలన జీవితంలో ఏదీ నేర్చుకోలేని అసమర్థులుగా పిల్లలు తయారవుతున్నారు. 20 సం॥రాల పాటు పిల్లలకి ఏదో నేర్పిస్తాయని వ్యవస్థ భావించే ఈ కసాయి గృహాలు పిల్లల్ని ఏమాత్రం సృజనాత్మకతాలేని, అనుభూతులకి లోనుకాని జడులుగా మలుస్తూన్నాయి.

**కుటుంబమేం చేస్తుంది?**

ఈ హింసని మరింత ప్రేరేపిస్తుంది. మంటను ఎగదోస్తుంది. మామూలుగానే ఆధిపత్యాన్ని సంస్కృతిలో జీర్ణించుకున్న ఈ దేశ సాంఘిక వ్యవస్థ, అసమానతల్ని ప్రజల్లోని అత్యధికశాతం మందిచేత అంగీకరింపజేసే బాధ్యతను నెత్తినెత్తుకుంటుంది.

పిల్లలు కనడమనే తతంగాన్ని పెళ్ళికో, సెక్స్‌కో, హోదాకో, వారసత్వానికో ముడిపెట్టే భావజాలం బలంగా అమలౌతున్న పరిస్థితుల్లో సంసారం వల్ల ఉనికిలోకి వొచ్చిన అక్కర్లేని తప్పనిసరి జీవులుగా పిల్లల్ని పరిగణించడం జరిగినంతలా, తదాత్మ్యంతో కూడిన ఆత్మీయత వల్ల జనించిన భవిష్యత్ నిర్మాతలుగా పిల్లల్ని చూడటం జరగడం లేదు. కులం, మతం, పురుషాధిపత్యం, సామ్రాజ్యవాదమనే జాఢ్యాల్ని తనివితీరా మోస్తున్న సమాజం నించి వేరుపడి విడిగా కుటుంబమూ, స్కూలు మనలేవు. పిల్లలు కూడా తప్పనిసరిగా అదే భావజాల ప్రభావానికి లోనౌతారు. కుటుంబం స్వతహాగా నేర్పించడమనే లక్షణం నుంచి దూరమై దాన్ని స్కూలుకి అప్పగించడంతో నిజంగా ఎంతో నేర్చుకోడానికి అవకాశమున్న కుటుంబ వ్యవస్థ నిర్లిప్తమైంది.

## అప్పుడేం జరుగుతుంది?

ఈనాటి సమాజాన్ని చూస్తే తెలుస్తుందది. ఇంత స్థాయిలో గుమస్తాల్ని ఉత్పత్తి చేసే యంత్రాంగం బహుశ ఏ దేశంలోనూ ఉండి ఉండదు. విలువల్ని చులకనగా చూస్తూ మనుషుల్ని సరుకులుగా భావిస్తూ కేవలం కొద్దిమందికి నిజంగా సాధ్యమయ్యే అవకాశాల్నీ, అనుభవాల్నీ ఎల్లప్పుడూ ఎవరికి వారే సాధ్యమని ఎవరికో నిరూపించుకునేందుకు చేసే వ్యాయామాన్ని నాగరికతగా భ్రమించడం జరుగుతోంది.

అక్షరాల్ని దొర్లించడం, అంగ్లాన్ని వల్లించడం మాత్రమే జ్ఞానంగా, మేధోప్రమాణంగా గుర్తించబడే వ్యవస్థలో అప్రయత్నంగానే ఒళ్ళొంచి శ్రమించడం, స్వతంత్రంగా ఆలోచించడం అవాంఛనీయ రూపాన్ని సంతరించుకున్నాయి. సామాన్యమయిన ఆసక్తి అశక్తతగా చలామణీ అవుతే అసాధారణ ఉద్రేకాలు శక్తివంతమైన వ్యక్తిత్వానికి ప్రతీకగా చిత్రించబడుతున్నాయి. ఆడంబరాలు, డాంబికాలు సహజమైనవిగా భావించబడుతోంటే, నిరాడంబరత, నిబద్ధత అసహజ లక్షణాలుగా ఆపాదించబడు తున్నాయి.

## మరిప్పుడేం చేయాలి?

ఏం చేయాలన్నా ముందు స్కూల్ ఏం చేస్తుందో తెలియాలి. మన మెదళ్ళలో కూరిన ఆలోచనల్నించి బయటపడాలి. ప్రత్యామ్నాయ విద్యావిధానాల గురించి తెల్సుకోవాలి. తల్లితండ్రులంతా సంఘంగా ఏర్పడాలి, అలాగే పార్టీల్తో సంబంధంలేని విద్యార్థి సంఘాల్ని ప్రోత్సహించాలి. బాల్యం నించే సమిష్టి సహకారం పట్ల అవగాహన కలిగేలా కుటుంబం నడుచుకోవాలి. స్కూలనేది సమాజం నుంచీ విడివడి లేదనే నిజం తెల్సుకోవాలి. టీచర్లు, మేధావులు, అధికారులు, రాజకీయవేత్తలు పిల్లల్తో గడపడమొక దినచర్యగా అలవాటు చేసుకోవాలి.

దళిత బహుజన, గిరిజన స్త్రీలకిప్పుడిప్పుడే అందుబాటులోకి వస్తున్న స్కూల్ని వారికి దూరం చేయడం ఏ విధంగా భావ్యమనే వాదనొకటి ఉంది. అణగారిన కులాలవారికి దూరం చేయబడ్డ స్కూల్ని వారికందకుండా చేయడానికే ఇలాంటి స్కూళ్ళొద్దనే సిద్ధాంతాలు పుట్టిస్తున్నారనే ఆరోపణ కూడా ఉంది. నిజానిజాలు తెల్సుకునేదాకా ఈ వర్గాలవారికీ స్కూల్ తప్పదు. కానీ, అంతిమంగా చూసినప్పుడు ఈ రోజున్న స్కూళ్ళు సమూలంగా పునర్నిర్మించాలనేదే సరైన వాదం.



## మనవంతుగా ఏం చేయొచ్చు?

హోమ్ స్కూలింగ్ గురించి తెల్సుకోవాలి. స్కూల్ను ప్రశ్నించడం నేరమనే ధోరణి పోవాలి. ఈ రోజు సమాజంలో నెలకొనున్న చెడుగులన్నింటికీ విద్యావ్యవస్థ ఒక ప్రధాన కారణమని గుర్తించాలి. ఎంత చిన్నతనంలో స్కూల్కి పంపితే అంత త్వరగా చదువొచ్చి గొప్పవాళ్ళవుతారనే భ్రమల్ని వొదుల్చుకోవాలి. స్కూలనేది కేవలం కొన్ని నియమనిబంధనల్ని పాటింపజేసే ప్రదేశంగా చూడబడాలి.

అంతమాత్రంలో స్కూల్ని ద్వేషించనక్కర్లేదు. చారిత్రకంగా స్కూల్ రూపొందిన నేపధ్యాన్ని విశ్లేషించుకుంటే, స్కూలు ఇలా ఎందుకుందన్న విషయం గ్రహింపుకొస్తుంది. జ్ఞానార్జనకి స్కూలే శరణ్యమన్న భావన తొలగిపోతుంది. బయటి జీవితంలో ఎందుకూ కొరగాని అంశాల్ని వంతులవారీగా 'సబ్జెక్ట్స్' పేరుతో సమయాన్ని కేటాయించి మరీ బోధించడం చూసి తప్పకుండా పిల్లలపై జాలివేస్తుంది. ఎంపిక చేసిన యువతకి ఉద్యోగాల పేరుతో బానిసలకి తర్ఫీదిచ్చే శిక్షకులుగా మల్చే ఈ తతంగం కోసం ఏర్పాటయిన ఇంత పెద్ద రాజ్యాంగ యంత్రాంగపు శాఖల్ని చూసి కచ్చితంగా నవ్వుతోబాటు ఏడుపూ వస్తుంది.

..........

# 3. మనుషులకి చదువక్కర్లేదు...!

అమ్మబాబోయ్, ఇంకేమైనా ఉందా? లోకం తలకిందులైపోదూ, ఇన్ని స్కూళ్లూ, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు, ఉద్యోగాలు, కోచింగులు, ఎంట్రన్స్‌లు, హోదాలు, డిగ్రీలు.... ఇవేవీ లేపోతే ఎలాగ?

అసలు చదువు లేకుండా వ్యవస్థెలా నడుస్తుంది?

మనిషి చదువు లేకుండా ఎలా మనగలడు?

చదువులేని నాగరికత ఉంటుందా?

*** *** ***

శీర్షికని మళ్ళీ చదవండి, నేనన్నది మనుషులకి చదువు అవసరం లేదని మాత్రమే.

మనుషులు మనుషులుగా మారడానికి విద్య అవసరం.

మనుషులు మనుషులుగా మెలగడానికి జ్ఞానం అవసరం.

మనుషులు మనుషులుగా ఎదగడానికి శీలం అవసరం.

మనుషులు మానవత్వం పొందడానికి ప్రజ్ఞ అవసరం. ఇక్కడ చదువు అనే దానికి స్థానం లేదు.

నిజానికి మానవ చరిత్ర మొత్తంలో 'చదువు' వల్ల ఒనగూడిందేమీ లేదు.

*** *** ***

ఇంతకీ ఈ చదువంటే ఏంటి? అదెందుకు? చదువు అనేదొక దీర్ఘకాలిక శిక్ష. చదువనేదొక అవాంఛనీయ మానసిక వ్యధ. చదువనేదొక క్రూరమయిన శారీరక రొద. చదువనేదొక కృత్రిమ కాంక్ష. చదువనేదొక చిత్త భ్రమ.

మామూలుగా వైద్యశాస్త్రానికి అంతుబట్టని ఇంత పెద్ద రోగం ఇన్ని సంవత్సరాలుగా విజ్ఞానం పేరుతో నివారించడానికి వీల్లేని స్థాయిలో, ప్రమాదకరంగా ఎంత విస్తృతిలో వ్యాపించిందో చూస్తే నోట మాట రాదు. ఆ భయంకర రోగం పేరు చదువు. దాన్ని వ్యాప్తి చేసే ప్రదేశం స్కూలు.



*** *** ***

జీవితాంతం రాజీపడి ప్రశ్నించకుండా బతుకీడ్చడానికీ, జీవితంలో వచ్చే కష్టసుఖాలని ఎదుర్కోకుండా సహించడానికీ, అసలు జీవితాన్ని జీవితంగా కాక ఎవరో ఎంపిక చేసిన సంఘటనల సమాహారంగా భావించి, ఎందుకో తెలియని అనుకరణని అందరితోబాటు అనుభవించడానికి స్వచ్ఛందంగా ముందుకు రావడాన్నే జీవితం అనుకొనేలా ఆలోచింపజేయడానికి చదువు అవసరం.

ఎప్పటికీ లేని సంతృప్తిని సంపాదనలో వెతుకులాడ్డం కోసం, అయిపూజాడా లేని ఆనందాన్ని అసంతృప్తితో అన్వేషించడం కోసం, లక్ష్యంలేని గమనాన్ని అహంకారంతో పూరించి దానికి ఆధ్యాత్మిక శోచననో, ఐహిక వంచననో ఆధారం చేసుకుని దేవులాడ్డం కోసం చదువనేది అవసరం.

*** *** ***

చదువు వల్ల మనిషి ఏమౌతాడు?

మనిషి కాకుండా పోతాడు. విపరీతమయిన ఒత్తిడికి లోనౌతాడు. పరాయీకరణ చెందుతాడు. మర్యాదస్తుడుగా పిలిపించుకునేటందుకు జీవితంలోని పాశ్వాలన్నింటినీ బలిపెట్టే మూర్ఖుడుగా మారతాడు. కళల్నీ, మానవసంబంధాల్నీ గౌరవించలేని వ్యర్థుడిగా తయారవుతాడు. నిజమైన సౌందర్యాన్ని చూసే చేవలేని యంత్రంగా మిగులుతాడు.

చదువు మనిషిని అమనిషిన్చేసేస్తుంది. ఏమాత్రం అంతర్మథనాన్నీ కలిగించలేని కేవల అస్తిత్వరూపంగా వ్యక్తిని మలుస్తుంది. అనుభూతుల్ని జీర్ణించుకోలేని ఒక అసమర్థ పిరికి జాతిని ఉత్పత్తి చేస్తుంది. మొత్తంగా చదువు వ్యక్తిని నిర్వీర్యం చేస్తుంది.

*** *** ***

ఎలా? నా చిన్నప్పుడు మా తాతతో కల్సి ఊళ్ళో ఫ్యాక్టరీ స్కూల్‌కి వెళ్ళేవాడ్ని. పంచదార ఫ్యాక్టరీ ఉద్యోగుల పిల్లల కోసం పెట్టిన స్కూలది. తర్వాత ఎన్నో స్కూళ్ళు మారాను. అవన్నీ ఎంతో కొంత నాకు విద్యనందించాయనే విషయాన్ని ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా యింత కచ్చితంగా నిర్మొహమాటంగా ఒప్పుకోడానికి

నిరాకరిస్తున్నానంటే అందుకు ఈరోజు ఆ అవ్యవస్థ పట్ల నాకున్న అసంతృప్తి ఒక కారణమైతే, అది నాకిచ్చిన అజ్ఞానంపై మితిమీరిన అసహ్యం కూడా ప్రధాన కారణం.

చాలా సంవత్సరాల క్రితం ట్యూషన్ సెంటరొకటి కొంతకాలం నడిపాను. అప్పటిదాకా నాలోనున్న ఆ చదువు తాలూకు నియంతృత్వ ఛాయల్నే నా విద్యార్థులకి కూడా చెప్పి వాళ్ళని కూడా ఈ ఊబిలోకి తోసేయడానికి నా వంతు ప్రయత్నం చేసాను. ఏదేమైనా మేల్కోవడం ఆలస్యంగా జరిగింది. ఎలాగైతేనేం చివరికి తెల్సింది, స్కూలంటే మనుషుల్ని మరలుగా మార్చే ఫ్యాక్టరీ అని.

*** *** ***

పుస్తకాలు, బోధన, పరీక్షలు, ఉద్యోగం.
మతాలు, హోదాలు, విలాసాలు, వినోదాలు.
జబ్బులు, రోగాలు, బాధలు, విషాదాలు.

ఈరోజు సమాజంలోని చెడుగులన్నింటికీ దశాబ్దాలుగా మనం పాటిస్తున్న చదువు కూడా ఒక ముఖ్యమయిన కారణం. చదువంటే ఏమిటన్న ప్రశ్నను మరింత విస్తృత పరచుకొని విశ్లేషించుకుందుకు ప్రయత్నించే ముందు అసలు చదువు పుట్టు పూర్వోత్తరాలు సంక్షిప్తంగానయినా చర్చించుకోవడం మంచిది.

**చదువు పరిణామ క్రమం :**

మానవ పరిణామంలో ప్రతీదీ విద్యే. విజ్ఞానంలో అంతర్భాగమే. తొలినాళ్ళ నాటి వేట, మలినాళ్ళ నాటి వ్యవసాయం, తదుపరి వ్యాపారం అన్నీ చదువులే. చదువంటే పుస్తకాలు, రాతలు, అరుపులు, బోధనలు కాదు. మనిషిని నాగరికుడిగా మలిచిన నైపుణ్యాలేవీ వాళ్ళకి స్కూల్లో నేర్పడం జరగలేదు.

**చదువంటే భాష కాదు :**

మనిషి శతాబ్దాల కృషితో సముపార్జించుకున్న ఒక సమిష్టి నిర్మాణం భాష. నిశ్శబ్దం నుండీ సంకేతాలకీ, సంజ్ఞల నుంచీ శబ్దాలకీ, శబ్దాల్నుండీ పదాలకీ, పదాల్నించీ లిపికీ... మొత్తంగా భాష మానవాళి సాంస్కృతిక వారసత్వానికి బలమైన ప్రతీక.

కాని చదువంటే భాషే కాదు.



**చదువంటే నైపుణ్యం కాదు :**

దీన్ని నిరూపించాల్సిన అవసరం లేదు. చర్మం వొలవడం, బొచ్చు గొరగడం, విత్తులు నాటడం, బట్టలు నేయడం, చేపలు పట్టడం, చేష్టలు చేయడం.... లాంటివన్నీ ఇతర దేశాల్లో సంవత్సరాలబాటు జాగ్రత్తగా నేర్చుకోదగ్గ గౌరవనీయ వృత్తులైతే, ఇక్కడ మాత్రం నీచ పనులు.

**చదువంటే విద్య కాదు:**

విద్యలో చదువనేదొక చిన్న భాగం కావొచ్చునేమో కానీ చదువంటే విద్య మట్టుకు కాదు. విద్య యొక్క విస్తృతిని గుర్తించడానికి కొంతవరకు చదువు ఉపయోగపడొచ్చుగానీ మొత్తంగా విద్యకీ, విజ్ఞానానికీ చదువుకీ సంబంధం ఏ కోశానా లేదు.

**చదువంటే సంధ్య కాదు:**

మొదట్నుంచీ బ్రాహ్మల భాషనే నెత్తిన రుద్దించుకోడానికి అలవాటుపడిన ఈ దేశంలో ఒక వర్గపు సంస్కృతీ సంప్రదాయాల్నే ఉన్నతంగా చిత్రించడం జరిగింది. అందులో భాగంగా పనిచేస్తూ శ్రమించేవార్ని చులకన చేసి వాళ్ళని చదువురానివారుగా ప్రచారం చేయటం జరిగింది. ఆ కుట్రలో ఒక భాగమే భాషా వ్యవహారం. చదువు, సంధ్యల్ని కలిపిందందుకే.

**చదువంటే సంస్కారం కాదు :**

దేశంలోని ఎక్కువ మంది శ్రమజీవుల కష్టాన్ని గుర్తించే సంస్కారంలేని మేతావులంతా సంస్కారాన్ని వ్యక్తిగత ప్రవర్తనలో మినహాయించుకుని పుస్తక రాతల్లో మాత్రమే విశ్లేషించే పనిపెట్టుకోవడంతో ఆధిపత్యవర్గాలవారు ఆచరించిందే సంస్కారమన్న భావన సమాజంలో బలంగా వేళ్ళూనుకుపోయింది. నిజానికి అది అతి పెద్ద కుసంస్కారం.

**చదువంటే పుస్తకాలు కాదు:**

చదువుకీ పుస్తకాలకీ ఎన్నడూ సంబంధం లేదు. అలా లేదని ఒప్పుకోవడానికి సిద్ధపడని వ్యవస్థ దుందుడుకుగా వ్యవహరిస్తూ ప్రపంచంలోని కంపెనీలకి భవిష్యత్ ఉద్యోగుల్ని తయారుచేసిచ్చే కర్మాగారాలుగా స్కూళ్ళని మల్చుకోడంతో చదువంటే పుస్తకాలనే భ్రమ ఏర్పడింది.

**చదువంటే పరీక్షలు కాదు:**

కొద్దిమంది ఆలోచనల ఆధారంగా ముద్రించబడిన అక్షర నియంతృత్వాన్ని పాఠ్యపుస్తకాల రూపంలో పిల్లలపై దారుణంగా రుద్దడమే కాక అలా చేయడం అప్రజాస్వామికమనే ఇంగితం లేక మళ్ళీ ఈ తతంగానికి పరీక్షలనే పేరు కూడా పెట్టడం స్వచ్ఛమైన శాడిజం.

**చదువంటే మార్కులు, ర్యాంకులు కాదు:**

ఇంతకంటే పనికిమాలిన సూత్రీకరణ వేరోటి లేదు. పసిమనసులపై పరీక్షల పేరుతో మతిమాలిన హింసని రుద్దడమే కాక, ఆ రుద్దుడుని తట్టుకుని బతికి బయటపడ్డవారికి అంకెలాధారంగా సంఖ్యల్ని కేటాయించీ మొత్తం జీవితాంతం వ్యక్తి నైపుణ్యాన్నీ, జ్ఞానాన్నీ సర్టిఫికెట్లలో ఇరికించడమంత ఘోరం మరోటి లేదు.

**చదువంటే పిల్లలూ, టీచర్లూ కాదు:**

ఈ దేశ దౌర్భాగ్యం ఏమిటోగానీ ప్రతీదీ చాలా స్పష్టంగా అక్రమం కావించబడుతుంది. చదువు కూడా ఇందుకు మినహాయింపేం కాదు. సమాజం మొత్తానికీ ఏమాత్రం సంబంధం లేకుండా అదేదో విద్యార్థులనబడే పిల్లలకీ, టీచర్లనబడే ఉద్యోగస్తులకీ చెందిన ప్రయోగం చదువు కాదు.

**చదువంటే హింస కాదు:**

ఇది బొత్తిగా నమ్మశక్యం కాకున్నా నిజం. అసలు చదువుకీ స్కూలుకీ, పర్యాయపదాలుగా ఫేముబెత్తాలు, సొంటిపిక్కలు, గోడకుర్చీలు, మోకాళ్ళమీద కూర్చోడాలు, బెంచీలమీద నిల్చోడాలు, తన్నులు ….. ఇంకా అనేక రకాల చిత్రహింసలు మారిపోయిన తరుణంలో చదువంటే శిక్షలు కాదనే విషయం గ్రహించడం చాలా అవసరం.

**చదువంటే బోధన కాదు:**

అసలు బోధించని స్కూళ్ళుంటాయా? ఉంటాయి. ఎన్నో ఉన్నాయి కూడా. కాకపోతే చెప్పడాన్నీ, చెప్పించుకోడాన్నే చదువుగా చూసే సంస్కృతి అలవాటయి చెప్పకపోతే, కొట్టకపోతే చదువెలా వస్తుందన్న ఇంగితంలేని ప్రశ్నను సంధించడం జరుగుతుంటుంది.



**చదువనేదొక స్పృహ:**

మనకి మన అస్తిత్వంలోని చైతన్యాన్ని గురించిన అవగాహనను ఎరుకపర్చేదే చదువు. అదే చదువనేదాని ప్రాథమిక అవసరం. చదువనేదెలా ఉందో విమర్శించుకుంటే చాలదు. ఎలా ఉండాలో చర్చించుకోవాలి. అందుకు స్పృహ తెచ్చుకోవాలి.

**చదువు విద్యలో ఒక భాగం:**

స్పృహ వొచ్చాక కూడా గతాన్ని పట్టుకు వేళాడుతున్నామంటే అజ్ఞానంపై అభిమానం చావలేదన్నమాట. కాబట్టీ, చదువు కేవలం విద్యలో ఒక చిన్న భాగం. విద్యకి సమానార్థంగా చదువనే పదం వాడటం వల్ల వొచ్చిన ఇబ్బందిది.

**విద్య అంటే ఏమిటి?**

సాటి మనుషులతో సఖ్యంగా జీవించేందుకూ, సమాజంలోని మంచి చెడులపై అవగాహన ఏర్పర్చుకునేందుకు పనికొచ్చే దృష్టికోణమే విద్య. ఐతే ఇది నిరంతర సాధనా క్రమపు సంక్షిప్త నిర్వచనం మాత్రమే. విద్య అంతిమ లక్ష్యం విశ్వ శ్రేయస్సు.

**విద్య ఎందుకు?**

సమాజంలో వ్యక్తి ఏకాకిగా మనలేడు. సమాజమంటేనే సమిష్టితత్వానికి చిహ్నం. అటువంటప్పుడు వ్యక్తి తనని తాను తీర్చిదిద్దుకోడానికీ, సమాజ గమనంలో ఉత్పత్తి శ్రమలో భాగం కావడానికీ విద్య అవసరం. విద్య లక్ష్యం విముక్తి.

**విద్య అవసరం ఎవరికి?**

అసమానతలతో నిండిన ఈ దేశ వ్యవస్థలో సమాన విద్యను రూపొందించాలి. శతాబ్దాలుగా పీడితులుగా బతుకుతున్న బహుళ ప్రజానీకపు సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుని మాత్రమే విద్య రూపొందాలి.

**విద్యని నిర్మించాలా?**

ఎవరైతే నిర్మించారో వాళ్ళని ఊళ్ళకి దూరం చేసిన దుర్మార్గాన్ని మొదట ప్రశ్నించాలి. తదనంతరం వివక్షలేని విద్యని వృద్ధి చేయడం ఎలాగో పరిశీలించాలి.

**అందుకేం చేయాలి?**

ఇప్పుడున్న స్కూళ్ళ స్వరూపాన్ని సమూలంగా మార్చే 'విద్య'ని అధ్యయనం చేయాలి. విద్యనేదొక విశాలమయిన భావజాలం కావాలి.

**మరి, ఇప్పుడున్న స్కూళ్ళు....?**

అవి కసాయి గృహాలు, రోజూ వందల, వేలమంది విద్యార్థుల్ని నెత్తురోడకుండా హత్య చేస్తున్న హంతక ముఠాల ఆధ్వర్యంలో నడుస్తున్న వధశాలలవి.

**ఇప్పుడేం చేయాలి?**

విద్యనేదెందుకో తెల్సుకోవాలి.

కసాయి స్కూళ్ళకు పిల్లల్ని పంపడం మాని హోమ్‌స్కూల్ విద్యావిధానాన్ని వృద్ధి చేసుకుంటూ, ప్రత్యామ్నాయ ప్రజాస్వామిక విద్యగురించి తెల్సుకోవాలి. ఈ క్రమంలో ఈసరికే కృషి చేస్తున్నవారితో కల్సి పనిచేసేందుకు సిద్ధమవ్వొచ్చు.

**మనుషులకు చదువక్కర్లేదన్నారెందుకు?**

ఈరోజున్న విద్యావిధానం గురించి అభిప్రాయాలు చూసారు కదా. అలాంటప్పుడు యంత్రాలుగా కాక మనుషులుగా ఎదగాలనుకునేవారికి చదువు ఈ తరహాలో అక్కర్లేదనేది నిజం కాదా, ఆలోచించండి.

..........



# 4. తరగతిగది తత్వశాస్త్రం

పిల్లల జీవితం తరగతిగదిలోనే మొదలౌతుందనే ప్రచారం ఉంది. నిజానికి పిల్లల జీవితం తరగతిగదిలోనే ధ్వంసమౌతుందనేది ఒక వాస్తవిక దృష్టికోణం. తరగతిలోకి పిల్లలందరికీ ప్రవేశం ఉండదు. పిల్లల రంగూ, దుస్తులు, కుటుంబ నేపథ్యం, కులం, మతం, హోదా అన్నీ అప్రకటితంగానే ప్రధాన పాత్ర పోషిస్తాయి. తెల్లగా, బొద్దుగా నిగనిగలాడే స్కూలు పిల్లల్ని మాత్రమే 'విద్యార్థులుగా' భావించే వాతావరణాన్ని వ్యవస్థ మెదడులోకి నెట్టిన 'ప్రధాన స్రవంతి', నల్లగా, సన్నగా, చిరిగిన బట్టలేసుకునే కష్టజీవుల బిడ్డల్ని అసలు తరగతిగదిలోకి రాగలిగిన పిల్లలుగా కచ్చితంగా గుర్తించడం లేదు. ఈ దేశంలో ప్రతీ తరగతిగదికీ కులం ఉంది, వర్గం ఉంది, వర్ణం ఉంది, లింగం ఉంది, ప్రాంతం ఉంది. కాబట్టే తరగతి గదనేది స్పష్టంగా కొందరు పిల్లల కోసమే నిర్మించబడింది. మిగిలిన పిల్లలకి ఆ తరగతిగదిలోకి ప్రవేశం ఉండదు.

అలా తరగతి గది యొక్క తత్వశాస్త్రంలో అసమాన విద్యనేది ప్రాథమిక విభాగం. తరగతిగదిలోకి ప్రవేశించిన పిల్లలకు మొట్టమొదట మనుషుల్ని తరగతులుగా విడగొట్టడమనేది తెలుస్తుంది. పెద్ద, చిన్న అనే తరగతుల విభజన స్పష్టంగా కనిపిస్తుంది. విభిన్నతని ఎంతమాత్రం సహించలేని తరగతిగది, పిల్లలంతా ఏకరూపమైన దుస్తులు ధరించీ యూనిఫామ్, టై, బూట్లూ, పుస్తకాలు అన్నీ ఒక్కలాగే ఉండాలని ఆదేశిస్తుంది. భిన్నత్వాన్ని అడుగడుగునా జీర్ణించుకున్న సాంఘిక వ్యవస్థకి విరుద్ధంగా, అందరితో సమానంగా కనిపించడమొక క్రమశిక్షణా చిహ్నంగా ప్రచారం చేస్తుంది. నిజజీవితంలో ఎదురయ్యే విభిన్న స్వభావాల పరంపరను ఒక్క దెబ్బతో తుంచేసి, తరగతిగదిలోకి బట్టల ద్వారా, హంగుల ద్వారా ఎలాగైతే ప్రవేశం పొందారో సమాజంలో సైతం అలాగే ఆడంబరాలతో నడుచుకోవడమొక ప్రత్యేక అర్హతగా చూడబడుతుందనే భావాన్ని నేర్పిస్తుంది.

ఇతరుల్తో, బయట పిల్లల్తో సంబంధం లేకుండా అమ్మనాన్నల్నుంచీ మొదలుకుని బంధుమిత్రుల వరకూ ఎవరితో కలిసినా 'తరగతిగది' జీవులుగా తమ 'స్థానాన్ని' గుర్తుంచుకోవాలనే విషయాన్ని పిల్లలకు బోధించడం జరుగుతుంది. పాఠ్యపుస్తకాల్ని మనుషులు రాసిన విషయ సంకలనంగా కాక ఆకాశంలోంచి ఊడిపడ్డ

పవిత్రగ్రంథాలుగానూ, ఉపాధ్యాయుల్ని ఉద్యోగం కోసం చదువుచెప్పే నిరంతర విద్యార్థులుగా కాక పిల్లల కోసమే అవతరించిన స్వయంభువులుగానూ భావించే వాతావరణాన్ని సృష్టించీ, తరగతి గదినో దేవస్థానంగా మార్చేయడం జరుగుతోంది. భక్తులెలా మతాల బాధితులో, విద్యార్థులలా తరగతిగది బాధితులు. సమాజంలో ప్రతీ వ్యక్తికీ నిర్దిష్టమయిన స్థానముంటుందనే కర్మవాదాన్ని కచ్చితంగా అమలు చేస్తున్నవి తరగతిగదులే.

అలా తమ స్థానాన్ని గుర్తించిన పిల్లలు వారికి తెలీకుండానే రూపాన్ని, హోదానీ, స్థానాన్ని చూసి ప్రభావితం కావడం, స్పందించడం చేస్తారు. ఈ దేశంలో రూపం, హోదా, స్థానం కులంతో ముడిపడుండడంతో తరగతి గది పిల్లలు వారి వారి రూపాల్ని బట్టీ, హోదాల్ని బట్టీ, స్థానాన్ని బట్టీ ఇతర పిల్లలతో కలవడమనేది చేస్తారు. ఈ వికృత గుణాల్నే అందంగా, నాయకత్వంగా చూపించే ప్రసారమాధ్యమాలు, సమాజం, కుటుంబం దయవలన 'అందం', 'నాయకత్వం' అంటే, చిన్నప్పట్నుంచే వారిలో ఒక తరహా అప్రజాస్వామిక అభిప్రాయం ఏర్పడుతుంది. అలాగే జీవితాన్ని నిర్దేశించే అన్ని ముఖ్య విషయాల్లోనూ పిల్లల మెదళ్లలో అసమాన ఆలోచనలన్నింటినీ తరగతి గది నింపుతుంది. అందుకు భిన్నంగా బతుకుతున్న ఎక్కువమంది ప్రజల జీవితాల్ని 'వేరుగా' చూసే లక్షణం చిన్నప్పుడే వారికీ విధంగా అబ్బుతుంది.

అసమానతల్ని పాటించడం అంటువ్యాధి లాంటిది. ఆధిపత్య మనస్తత్వానికి అనివార్యంగా అది దారితీస్తుంది. ఆధిపత్యం ఒక రకమైన అజ్ఞానానికి కొమ్ముకాస్తుంది. జ్ఞానమనేది ప్రశ్నోత్తరాల వల్లనే సాధ్యమౌతుందనే స్పృహలేని తరగతి గది ప్రశ్నలకి యజమానులుగా టీచర్లని ఉంచి, జవాబు చెప్పడానికి మాత్రమే పరిమితమయ్యే బానిసల పాత్రను పిల్లలచేత పోషింపజేస్తుంది. ప్రశ్నించడం ఒక తరహా నేరమనే భావనను మరింత బలపర్చే తరగతిగది, చెప్పింది నోరుమూసుకు వినడమే నేర్చుకోవడమనే భ్రమను కల్పిస్తుంది. అందుకే ఆరోగ్యకరమైన వాతావరణం లేని తరగతి గదుల్లో పిల్లలు జవాబులు చెప్పడానికే తప్ప ప్రశ్నించడానికి అర్హులు కారనే భావనను ఆచరణలో అమలు చేస్తూ ఉండటం కనిపిస్తుంది.

నిజానికి ప్రశ్నోత్తరాల నేపథ్యం ఇక్కడే కాదు, అన్ని రంగాల్లోనూ ఇంతే. ఆధిపత్యాన్ని పాటించేవారు ప్రశ్నించబడ్డానికి అతీతులనే ప్రచారం చాలా బలంగా



ఉంది. అందుకే మతాధిపతులూ, కులపెద్దలు, రాజకీయ నాయకులు, మంత్రులు, అధికారులు, పారిశ్రామికవేత్తలు, బడా వ్యాపారులంతా ప్రశ్నలకి అతీతులనే సంగతిని భక్తులు, నిమ్నకులాలవాళ్ళు, కార్యకర్తలు, చోటా ఉద్యోగులు, కార్మికులు, కర్షకులు, కూలీలు గుర్తుంచుకునేలా జాతిభావాన్ని నిర్మించడం జరిగింది. దైవాంశ సంభూతులయిన ప్రవక్తల్ని ప్రతిమతమూ ఎలాగైతే అనుసరించిందో అలా పాఠ్యాంశాల్ని చెప్పడానికొచ్చే ఉపాధ్యాయుల మాటల్ని కూడా గుడ్డిగా పాటించే పద్ధతి ఇంకా తరగతిగదిలో ఉన్నది. మతగ్రంథాల్లోని విషయాలన్నింటినీ ఎలాగైతే సత్యాలని మనస్ఫూర్తిగా విశ్వసిస్తారో, పాఠ్యపుస్తకాల్లోనివన్నీ నిజాలనీ, ప్రశ్నించవీలులేని అంశాలనీ పిల్లల్ని నమ్మించడం జరుగుతోంది.

మరోపక్క భాషనేది ఒక కార్యాచరణనే విషయం తెలీని తరగతిగది, పిల్లలంతా ఒకేలా మాట్లాడాలనే విపరీత మనస్తత్వాన్ని పెంచిపోషించడంతో సహజసిద్ధంగా నిర్మితమవ్వాల్సిన భాష కూడా కృత్రిమత్వం రంగరించుకుని శవాడంబరాల్ని చేసుకుని ముస్తాబయి బయటపడుతుంది. ఒకే రకమైన తరగతిగదిలో ఒకే రకమైన ప్రశ్నల్తో ఒకేరకమైన జవాబులు చెప్తూ ఒకే రకమైన వేషధారణతో ఒకే రకమయిన అభిప్రాయాల్ని ఏర్పర్చుకునే ఈ పిల్లలంతా ఒక రకమయిన బానిసలుగా మారిపోతారనడంలో అసత్యం లేదు. ఒక విషయాన్ని వివిధ కోణాల్లోంచీ పరిశీలించే బహుముఖ సామర్థ్యం పెంపొందని పిల్లలు ప్రతివిషయాన్నీ ఒక్కలాగే చూసేందుకు అలవాటుపడతారు. విభిన్నతను స్వాగతించలేని నియంతలుగా తయారవుతారు.

అంటే, నాజూకుగా కనిపిస్తూ ఖరీదుగా జీవించడం తరగతిగది నుంచే మొదలవుతోంది. సహజసిద్ధమైన భావాలన్నీ ఒక క్రమపద్ధతిలో హత్య చేయబడిన తర్వాత, సమాజాన్ని నడిపించే పరిశ్రమలకి అవసరమయిన భావాల్ని పిల్లల మనస్సుల్లో ఎక్కించడం జరుగుతోంది. యువతగా, పౌరులుగా, ఉద్యోగులుగా... ఏ విషయాన్నైనా మరొకరు చూపించినట్లే చూడటం, వేరొకరు ఆలోచించమన్నట్లుగానే ఆలోచించడం, ఎవరికో నచ్చినట్లుగానే జీవించడం... జరుగుతోంది. వ్యవస్థీకృతమై ఉన్న ఆచారాన్ని ప్రశ్నించడం అతివాద లక్షణంగా చలామణీ అవుతూ ప్రపంచంలోనున్న పాలకులకి ఒదిగి వుండే పౌరులుగా, పెట్టుబడిదారులకి పన్లన్నీ చేసే ఉద్యోగులుగా బాల్యంలోనే పిల్లల్ని మలిచే ఒక కుతంత్రం దేశాలతో సంబంధం లేకుండా ప్రపంచంలోని ప్రతీ తరగతిగదిలోనూ అమలౌతోంది.

నేర్చుకోవడమనేది అరుదైన ప్రక్రియనే విషయం గ్రహించని తరగతిగది పిల్లల మెదడుని వీలైనంత సమాచారంతో నింపడానికి ప్రయత్నించడంతో, సమాచారాన్ని గుర్తుచేసుకుని సందర్భవశాత్తూ అప్పజెప్పడమే జ్ఞానంగా చూడబడుతోంది. ఈ క్రమంలో కుదిరినంత సమాచారాన్ని బుర్రల్లోకి ఎక్కించుకోవడమే కష్టపడి చదవడంగా ప్రచారమౌతోంది. అదక్కడితో ఆగక నేర్చుకోవడమనే దానికి నిరూపించుకోవడం తప్పనిసరి ప్రమాణమౌతోంది. ఈ తరహాలో జ్ఞానమనేది విభిన్న విధాలుగా సముపార్జించాల్సిన బహుముఖ అనుభవ విషయ సంగ్రహమనే విషయం వెనక్కిపోయి, ఒకే రకంగా అందరికీ నిర్వహించబడే పరీక్షల్లో లిఖితపూర్వకమయిన నైపుణ్యాన్ని కలిగివుండటమే, ఆ అనారోగ్యకరమైన పోటీలో సమాచారాన్ని గుప్పించడం ద్వారా మార్కులు తెచ్చుకోవడమే జ్ఞానంగా సమాజం పరిగణించేంత స్థాయికి పరిస్థితి దిగజారింది.

ఈ మొత్తం కార్యక్రమమంతా పకడ్బందీగా, విద్యార్జన పేరుతో, భావితరాల్ని తయారుచేయడం పేరుతో, పిల్లల కిష్టమయిన అనేక పేర్లతో జరిగిపోతుంటుంది. అలా మన పిల్లల్ని యంత్రాలుగా, బానిసలుగా, శవాలుగా మార్చడంలో తరగతిగది చేసే పని చిన్నది కాదు. రెండు దశాబ్దాలు తరగతిగది శిక్షణలో మెలిగిన పిల్లలు మనుషులుగా చచ్చి నటులుగా రూపొందుతారు. హావభావాల్నుంచీ ఆలోచనలదాకా గాలి పీల్చడం నుంచీ ఆచరణ వరకూ అంతా యాంత్రికంగా వేరొకరి కోసం వార్ని వారు మార్చుకునే పద్ధతికల అత్యాధునిక నాగరిక మనోవ్యాధిగల రోగులుగా తయారువుతారు. బతికినంతకాలం తరగతిగది తత్వశాస్త్రానికి విధేయులుగా ఉంటూ మర్యాదస్తులుగా అంతరించిపోయే వింతజాతి ఉత్పత్తవుతోంది. అలాంటి వెన్నెముక లేని నీరసజాతిని తయారుచేయడం కోసం రూపొందినవే తరగతిగదులనే నిజాన్ని యిప్పటికైనా తెల్సుకోవడం అవసరం.

.........



# 5. విధ్వంసక విద్య

జీవితంలోని ప్రతి విభాగాన్ని అంచెలంచెలుగా ప్రభావితం చేసి సమాజాన్ని మానవీయం చేయాల్సిన, అలా చేయడం కోసమే రూపొందిందని నమ్మిన ఒక బృహత్తర వ్యవస్థ, సరిగ్గా అందుకు వ్యతిరేకమయిన దృక్పథంతో జీవితంలోని పార్శ్వాలన్నింటినీ దశలవారీగా ధ్వంసంచేస్తూ సమాజం మొత్తాన్నీ స్తబ్దతగా ఉంచుతూ అదే నాగరికతని ప్రచారం చేస్తోంది. లోకంలో ఎక్కడాలేని, నిజజీవితంలో దేనికీ కొరగాని 'సబ్జెక్ట్'లను ఇష్టంలేని మనుషులు జీతాలకోసం తప్పనిసరై బోధిస్తుంటే, వాట్ని ఎన్నడూ ఇష్టపడని పిల్లలు పరీక్ష తప్పుతామేమోనని భయపడుతూ వింటుంటే, అసలీ ప్రహసనమంతా ఎందుకో అర్థం కాకపోయినా కష్టపడి పిల్లల్ని కన్నాం కనుక మాకు తప్పుతుందా అనుకునే తల్లితండ్రులు పాటిస్తుండబట్టీ ఈ వినాశనాత్మక విద్య కొనసాగుతోంది.

గోడలమధ్య మౌనంగా కూర్చుని రోజుకు కనీసం ఏడెనిమిదిమంది చెప్పే గోడు వింటూ అదెందుకో చెప్పేవారికీ, చేర్పించేవారికీ, చెప్పించేవారికీ పూర్తిగా తెలీకపోయినా అడక్కుండా ఉండటమే 'మంచి పిల్లల' లక్షణంగా చలామణీ అయ్యేచోట ప్రాథమికంగా విద్య అనేదేదీ రాదు. మాట్లాడటం, నవ్వడం, అరవడం, ఆడటం, ఎగరడం, తుళ్ళడం, మెరవడం... ఇవన్నీ పిల్లల సహజ లక్షణాలు. మనుషులుగా ఎదగడానికి అవసరమయ్యే మామూలు గుణాలైన జాలి, దయ, కరుణ, ప్రేమ, స్నేహం, సహనం లాంటివి కూడా ఏదో మేరకు వారిలో ఉండేవే. ఆరోగ్యకరమయిన ఈ స్వభావాలన్నిట్నీ విద్య పేరుతో నాశనం చేస్తూ పక్కవాడితో కూడా మాట్లాడకుండా ఉండటం, ఎవరి పనివారు చూసుకోవడం, ప్రతీదానికీ టీచరుపై ఆధారపడ్డం, ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ, కోరికల్ని బలవంతంగా చంపుకోడం అనారోగ్య చిహ్నాలు. వాటి ఫలాలే నేటి, రేపటి పౌరులు.

పక్కవారికోసం పట్టించుకోకుండా ప్రపంచం ఏమైపోయినా సరే నేనూ నా కుటుంబం బాగుంటే చాలన్న భావనకు బీజం యిదే. సొంతానికి తప్ప సమాజానికి పనికిరాని బానిసజాతిని తయారుచేసే వ్యవస్థ కాబట్టే అంకెలు, సంఖ్యల్లోనే బాల్యం నుంచీ పిల్లల్ని బంధించడం జరుగుతోంది. ఎవరికోసం పట్టించుకోకుండా ఎవరెన్ని మార్కులు సంపాదిస్తే అంతమంచి విద్యార్థనే రోగాన్ని పసిమనసుల్లో నాటి, జీవితాంతం వార్ని ఆ సంఖ్యల సంకెళ్లలో ఉంచుతున్నారు. స్కూల్లో అంకెల్ని ఆరాధిస్తూ పరీక్షల్లో ఎంత పెద్ద సంఖ్య ఎలా సంపాదించాలనే దానికోసమే అడ్డమైన దారులూ తొక్కడం నుంచీ ఆత్మహత్యలు చేసుకోవడం దాకా ఎలా జరుగుతోందో పౌర

సమాజంలో కూడా కుదిరినంత పోగేసుకొని సంపాదన సంఖ్యని ఎన్ని చెడ్డపనులు చేసైనా చేరుకోవడమే ప్రధానమౌతోంది.

కాపీకొట్టడం, స్లిప్‌లు పెట్టడం, కాకాపట్టడం లాంటివి పైరవీలు చేయడం, మోసం చేయడం, లంచగొండితనంగా రూపొందుతున్నాయి. పరీక్షల్లో వచ్చిన అంకెల్ని బట్టి విద్యార్థుల సామర్థ్యాన్ని అంచనా వేసే సంప్రదాయం బ్యాంకులో నిల్చిన బ్యాలెన్స్ ఆధారంగానే మనుషుల విలువని నిర్ధారించే సంస్కృతిని పెంపొందిస్తోందని గుర్తుంచుకోవాలి. ఎంత తక్కువ మార్కులొస్తే అంత తక్కువగా, చులకనగా చూసే విధానమే సమాజంలో కూడా ఎంత తక్కువ సంపాదిస్తే అంత లోకువగా చూసేలా చేస్తోంది. మార్కులు తక్కువొచ్చిన విద్యార్థుల్ని తిట్టడానికీ, కొట్టడానికీ హక్కుందనుకునే ధోరణి పిల్లల్లో నాటుకుపోడంతో ఆస్తిలేని పేదవార్ని చీదరించుకోడానికీ, చేయి చేసుకోడానికీ హక్కుందనుకుంటున్నారు. ప్రశ్నించిన, ఎదిరించిన విద్యార్థుల్ని కొట్టడం, చిత్రహింసలకి గురిచేయడం, అవతలకి పంపేయడం లాంటి పనులన్నింటినీ జాగ్రత్తగా మెదళ్ళల్లో ఇముడ్చుకున్న పౌరసమాజం, హక్కులకోసం ఉద్యమిస్తున్న, అక్రమాల్ని ప్రశ్నిస్తున్న వారిని వేధించడం 'సాధారణం' అనుకుంటోంది.

పెన్సిలు వాడాలో, పెన్ను వాడాలో, బ్లూ, బ్లాక్, రెడ్, గ్రీన్ యింకుల్లో ఏది వాడాలో. సింగిల్‌రూల్, డబల్ రూల్, వన్‌సైడ్, వైట్ నోట్స్‌లలో ఏది వాడాలో ఒక్కొక్కనోట్సూ ఎన్ని పేజీలుండాలో, పొట్టిదో, పొడుగుదో ప్రశ్ననో యింక్‌తోనూ, జవాబును మరో యింకుతోనూ ఎందుకు రాయాలో... అసలీ తతంగమంతా ఎందుకో తెలీకుండానే మెజారిటీ బతుకులు తెల్లారిపోతాయి. పిల్లలకి, పిల్లల కోసం వారికర్థమయ్యేలా, వారికి చాతనైన విధంగా, నచ్చిన, వచ్చిన పద్ధతిలో చదూకోడానికి, రాసుకోడానికీ, నేర్చుకోడానికీ ఉపయోగపడాల్సిన బడులు చిన్నతనం నుంచే ప్రతీ చిన్న విషయానికీ ఒకరిపై ఆధారపడే మనస్తత్వాన్ని కల్పిస్తున్నాయి. మాట్లాడాలన్నా, ఉచ్చుకో–దొడ్డికో పోవాలన్నా, మంచినీళ్ళు తాగాలన్నా అనుమతి కోరే విపరీత చర్యలవల్లా సహజంగా, సంతోషంగా స్నేహితులతో ఆడుకోవాల్సిన వాళ్ళని సమయం కేటాయించీ, వాళ్ళెలా ఆడుకోవాలో, ఏవేం ఆడుకోవాలో నిర్ణయించే పెద్దల మధ్య నిర్దిష్ట సమయాన్ని పెట్టి ఆటల్ని కూడా శిక్షల్లా రుద్దడం వలనా మొత్తంగా జీవితంలో ఏది చేయాలన్నా మరొకరి ఆదేశాలకోసం ఎదురుచూస్తూ, అటువంటి సారరహితమైన బతుకునుండీ పారిపోవడానికి సినిమా పేరుతో, మతం పేరుతో, రాజకీయం పేరుతో, వ్యసనాల పేరుతో, ఆడంబరాల పేరుతో సమయాన్ని కేటాయించుకునీ నిర్ణీతమయిన ఆ కాలంలో అస్తిత్వాన్ని నిలుపుకోవడమే సంతోషమనుకునే స్థాయికి దిగజారడం జరిగింది.



విద్యని సబ్జెక్ట్‌గా, తరగతులుగా, వయసుల వారీగా విభజించి ఇతరులతో పోల్చి చెప్పే అప్రజాస్వామికత పౌరసమాజంలో అలాగే పాదుకుపోబట్టే మనుషుల్ని డిగ్రీలతో, హోదాలతో, శాఖలతో, వయసుతో పోల్చిచూసి బాగా సంపాదిస్తున్న కొద్దిమందిని బూచులుగా చూపి అందరినీ పరుగుపందెంలోకి నెట్టడం జరుగుతోంది. ఈ క్రమంలో ఒత్తిడికి తట్టుకోలేక మధ్యలోనే ఆగిపోయే విద్యార్థులూ, వ్యసనాల్ని ఆశ్రయించేవారూ, నేరస్తులుగా మారేవారూ... అంతా వ్యవస్థకి ప్రతిబింబాలే. రోజురోజుకీ వ్యవస్థలో పెట్రేగిపోతున్న విపరీత ధోరణులు, నేరాలు, మూఢ నమ్మకాలన్నీ విద్య తాలూకు సాక్ష్యాలే. దేనినీ ప్రశ్నించకుండా 'మంచి పిల్లల' కోటాలో చోటు సంపాదించడంకోసం లెక్కలేనన్ని ఒత్తిళ్ళకి తలొగ్గి తలొంచుకునే తత్వాన్ని, దేనినీ ఎదిరించకుండా 'మర్యాదస్తుల' గ్రూపులో చేరడం కోసం వోర్చుకోలేని బాధల్ననుభవిస్తూ బానిసలా మౌనంగా పనిచేసుకుపోయే సామాన్యుడి స్వభావంతో అంచనా వేసుకుంటే కాని యదార్థం తెలీదు.

రోజులోని ఎక్కువభాగం పిల్లల జీవితంలోని కాలాన్ని జీవంలేని శబ్దం నిర్దేశిస్తుందనడం అతిశయోక్తి కాదు. క్రమశిక్షణ పేరుతో, సమయపాలన పేరుతో మోగే బడిగంట అసంఖ్యాకమయిన పసిమనస్సుల్లో కలిగించే విపరీతమయిన ఒత్తిడికి విధ్వంసక ఫలితం తప్పా సాక్ష్యం లేదు. ఎక్కడున్నా, ఏ పనిచేస్తున్నా ఆ గంటలిచ్చే సంకేతానికి స్పందించకపోతే శిక్ష తప్పదన్న భావన వార్ని దైనందిన జీవితంలో శబ్దాలకేగాని సంఘటనలకి స్పందించని నిర్దయులుగా చేస్తుంది. ఇంట్లోనూ, స్కూల్లోనూ, సమాజంలోనూ పిల్లల కిష్టంలేని పనిని వారిచేత చేయించడానికీ ఉపయోగించే అరుపులు, కేకలు, అంకెలు లెక్కబెట్టి ముగించేలోపల వినకపోతే శిక్ష తప్పదనే బెదిరింపులూ, మొత్తంగా జీవితంలో ఆధిపత్యాన్నీ, అహంకారాన్నీ ఎలాగైనా సహించక తప్పదనీ, వోర్చుకోకుండా ఎదురుతిరిగితే అంతే సంగతనే విషయాన్ని చాలా లౌక్యంగా, గౌరవంగా పిల్లల బుర్రల్లోకి ఎక్కించడం జరుగుతోంది.

ఆర్థిక, సాంఘిక, లైంగిక అసమానతల్ని అడుగడుగునా ఇముడ్చుకున్న విద్య స్వతహాగానే ఆధిపత్యానికి కాపలా కాయడం నేర్పిస్తుంది. విద్యార్థిగా మారడమనేదానికి జ్ఞానార్జన కంటే బట్టలు, బూట్లు, బెల్టు, టైలు, బ్యాడ్జిలు.... ఇలా యింత సరంజామాని సర్దుబాటు చేసుకోడానికి పిల్లల్ని వినియోగదారులుగా మలిచే కుతంత్రం పన్నుతుంది. పుస్తకాలు, టెస్ట్ బుక్కులు, గైడ్లూ, ఆలిన్‌వన్లూ, వర్క్‌బుక్కులూ, హోంవర్క్‌లు, డైరీలు, డ్రాయింగ్ బుక్కులూ, షార్ట్‌లూ, మాప్‌లు, గ్రాఫ్‌లూ... దుబ్బాధూళి. 'కొనడం', 'కొనిపించడం', అవసరమా అనవసరమా అనే ఇంగితాన్ని ఉపయోగించలేనంత స్థాయిలో ఆకర్షణీయ ప్రకటనల్ని గుప్పించి వీలైనంతగా ప్రజల్ని 'వినియోగపర్చే'లా

చూడటం ఈరోజు ప్రపంచ వ్యాప్తంగా నడుస్తున్న కంపెనీల లాభార్జనా సూత్రం. అందుకు జీవితంలోని అన్ని దశల్నీ, రంగాల్నీ వాడుకుందుకు వెనుకాడరు. అలాంటి బహుళజాతి సంస్థల ఉత్పత్తులకి పసితనంలోనే బీజాలు వేస్తే, ప్రపంచవ్యాప్తంగా నిర్దిష్టమయిన సరుకుల్ని జీవితాంతం వినియోగించడం కోసం పాతిక సంవత్సరాలపాటు విద్యార్జన పేరుతో స్కూళ్ళనీ, ఉపాధ్యాయుల్నీ, కాలేజీ, విశ్వవిద్యాలయాల్నీ, ఆశ్రయించీ, ఉద్యోగం పేరుతో అలాంటి ఒక సంస్థలో భాగమై తెలీకుండానే కుట్రలో పాలుపంచుకొంటున్నారో గుర్తించి ఇంత సిగ్గుమాలిన అమానుష నేరాన్ని జీతంతో, హోదాతో కప్పిపుచ్చుకోవడమెంత అన్యాయమో ఆలోచించడం అవసరం.

స్వతంత్రంగా ఆలోచించడం ఒకటుంటుందనీ, అసలు ఆలోచించడమనే ప్రక్రియే సొంతంగా చేయాల్సిందనే స్పృహలేని సమాజ రూపం బడిపై కూడా ఈ అవలక్షణాన్ని రుద్దుతుంది. ఏం చదవాలో, ఎలా చదవాలో, ఏం రాయాలో, ఎలా రాయాలో ఉపాధ్యాయులూ, ఏం చేయాలో, ఏం చేయకూడదో, ఏం తినాలో, ఎలా తినాలో, ఎంత తినాలో, ఎప్పుడు తినాలో, ఎక్కడ తినాలో తల్లితండ్రులూ ఎవర్ని గౌరవించాలో, ఎందుకు గౌరవించాలో, ఎప్పుడెక్కడ గౌరవించాలో సమాజమూ పిల్లలకి అనుక్షణమూ గుర్తుచేస్తూనే ఉండటం జరుగుతోంది. మానవ సంబంధాల్ని చులకనగా తీసిపారేసే వినియమయదారీ సంస్కృతి, డబ్బుంటే మనుషుల్ని లెక్కచేయనక్కర్లేదనే భావాన్ని కల్పిస్తుంది. స్కూల్లో మార్కులెక్కువ వచ్చిన విద్యార్థికి కల్పించే అహం, అంతమందిలో ఒక్కడ్నే ప్రత్యేకంగా నిలబెట్టి డప్పువేసే కార్యక్రమాలే అంతిమంగా సమిష్టితత్వాన్ని వెనక్కినెట్టి ఒంటరిగా ప్రత్యేకతను ఎలాగైనా సంపాదించుకోవడం కోసం ఎంతకైనా తెగించి పాకులాడ్డమే 'సక్సెస్' అనే నిర్వచనానికి దారితీస్తాయి. అప్పుడిక నలుగురినీ కలుపుకోవాలనే మానవీయ కాంక్షకంటే ఒక్కడిగానే ఎదగాలనే దురాశపూరిత ఆపేక్ష మనుషుల్లో మిగిలిపోతుంది. ఆ పెట్రేగింపే విలువల్ని ధ్వంసంచేసి వివేకాన్ని కాలరాస్తోంది. దీనంతటికీ మూలమైన విద్యని సమూలంగా మార్చకుండా సమాజం మారదు.

**సాంఘిక మార్పుకి వ్యక్తి మార్పే ముందడుగు.**
**రండి,**
**విధ్వంసక విద్యకి వ్యతిరేకంగా గొంతు విప్పుదాం,**
**వినాశనాత్మక విద్యావిధానాలని కాలరాద్దాం.**
**విప్లవాత్మక మానవీయ విద్యకై ఉద్యమిద్దాం.**

..........